## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100071538

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# రసభారతి
# నాటక మీమాంస

జమ్ములమడక మాధవరామశర్మ
సాహిత్య అకాడమి సభ్యుడు

అభినవభారతి
గుంటూరు

# పూర్వవాక్యము

అభినవభాష్యరసరసహృదయులు సహృదయులు భరతభారతి నాట్యవేదమును సంభావించుటకుత్సుకంపడిరి. స్వారస్యమున సర్వపరిచితకల్పముగానున్న నాట్యరసకల్పకము సచేతఃకమనీయకాంక్షాసమీక్షాస్పదమగుట సాహితీవ్రతులనేకవిధముల దక్షదక్షిణారాధనమొనరించిరి. తదుపాస్యరసనాట్యము తదీయకృతులలో నట్లట్లున్నది. కొందరు కొంత రూపించిరి. మరికొందరు మరికొంత నిరూపించిరి. కొంతలు కొంతలుగానున్న ఆ మిత హిత వచనములు తావదుపభోగరసికులకామోదమిచ్చినవి. అటునిటు చూచు పరిచూచు రసనేత్రులకింతింతలు అంతలంతలుగా గోచరించుట అసహజము కాదు. సర్వరత్నములకాకరము రత్నాకరము. సర్వభావసంవాదములకు నిదానము నిధానము అభినవభారతి. అభినవభారతిలోని స్వస్పందసుందరాంశములను కతిపయ విశిష్టసాహిత్యకులాయావిధముల నుపపాదించి ప్రశంసాభాజనులయినారు. అభినవగుప్తుని గుప్తగూఢమయిన భావవ్యూహము సకలవాచావాకములకాశ్రయమయినది. ఆతని యట్టి నిరూపణము కేవలము తదుపజ్ఞము కాదు. అది చిరంతనమభినవము. కావున సనాతనము. అభినవుడు సంప్రదాయార్థసముల్లాసకుడు. మధ్యకాలమున నెట్టిపోడుచుకొని వచ్చిన భావకసమాజభావముల సమీక్షకుడు. అట్లాతడుపపాదించుటయనంతరకాలానంతగ్రంథసముల్లాసదీపనమయినది. నాట్యవేదాభినవభాష్యములో రసభారతి నాటకమీమాంస స్వప్రతిష్ఠావైభవముకలదయినందున సహృదయపాఠకుల భావవివేకమునకుపకారదక్షమని లాక్షణికులు సంభావించిరి. మూడువందల యిరువదియెనిమిదిపుటల (౩౨౮) పరిమితికల ఈ గ్రంథమంతయు నాట్యవేదాంతర్గతమయినదని "నాట్యవేదము" నామధేయమె రూపధేయమిచ్చినది. ౧౩౯-౪౬౭ పుటల సంఖ్యాసంకేతమిట్లైవచ్చినది. ఇందు నిరూపితమయిన విషయసంపద యిట్లున్నది.

## రసభారతి

నాట్యరసమనదెట్టిది ? భావములెట్లుత్పన్నములు ? రసభావవికల్పము. నాట్యాంగము జ్ఞానార్ణవము – రసభావాదిసంగ్రహము - ఏకాదశాంగములు- కారికానిరుక్తములు- మహారసము- ఏకఘనమానసనిశ్చలత- మహాభోక్తృభావము- అలౌకికచేతోరసము- సాధారణ్యసిద్ధి- సామాజికునిసంవిత్సమావేశము- విలక్షణచిత్తవృత్తి- నిర్విఘ్నవిశ్రాంతి- రసమెనాట్యము- రసమొక్కటి- మహాస్ఫోటము మహారసమొకటి- శృంగారాదులు కల్పితములు- రసక్రమము - శాంతమునందే రసచర్వణము - స్థాయికథనము- భావసంకేతము- అభినయధర్మిప్రవృత్తులు- ఆతోద్యగానములు- రసలక్షణపరీక్షలు- రససూత్రము- వ్యాఖ్యాస్వారసత- భట్టలోల్లటభావము- ఉపచితస్థాయిరసము- శ్రీశంకుకాక్షేపము - స్థాయి రసమనుట తగదు - ఉపచయము చెప్పుట [illegible] రసము కాదు- రసమనంతమగును- హాస్యము షడ్విధమనుట కుదురదు- కామావస్థ

## నా ట క మీ మాం స

డించిరా? యని యనిపించునని యనెడు వారునున్నారు. అభినవుని వివృతి యందు ఆ వ్యాఖ్యాభావములుట్టంకితము లయినవి.

భామహుడలంకారప్రియుడు. తదలంకారము లన్నియు నతిశయోక్తిగర్భములు. అతిశయోక్తి లోకవిలక్షణోక్తి. అది వక్రోక్తి.

“సైషా సర్వత్ర వక్రోక్తిః కోఽలంకారోఽనయా వినా” వక్రోక్తిమూలకముగా సర్వాలంకారములనుపలక్షించినను భామహుడు రసమునుపేక్షింప లేదు. ఆతని మహాకావ్యలక్షణోల్లేఖములో రసావశ్యకత గోచరించును. ప్రేయోఽలంకారములో రసవదలంకారములో భామహుడు రసమునంతర్భావింపజేసినాడు. ఆతనికి రసమపరిచితము కాదు. రసతత్త్వమాతడు గుర్తించెను. కాని యుపయోగము నాతడు పట్టలేదు. అట్టి స్వరూపమాతని రచనలో కానరాదు. సర్వమాతనికలంకారకుక్షిప్రవిష్టమై జీర్ణమయినది.

దండి తత్త్వమెఱిగిన రసతత్త్వవేత్త. స్థానగౌరవసముచితముగా రససామర్థ్యముపపాదించుటకాతడు యత్నించెను. అలంకారములందే కాక గుణములందును దండి రసము సంభావించినాడు. గుణములందు రసములంతర్భవించినవి. దండికి మాధుర్యమున రసస్థితి యున్నది. “మధురం రసవద్వాచి.” ఏ యలంకారమయిన రసముఖమె. “కామం సర్వోఽప్యలంకారః రసమర్థే నిషించతి.” రసగుణముల కొక్క సంబంధము కూడ దండి తెలచినాడు. అప్రత్యక్ష రసమహత్త్వము దండిలో నున్నది. దండికి రసము ముఖ్యము కాదు. రీతులలంకారములాతని ముఖము లోనివి, ఆతడప్టరసవాది. ఆతని రసము కావ్యగతము.

వామనుని రీతి పేరు. రీతియె వామనుడు “రీతిరాత్మా కావ్యస్య” అనును. వామనుడు వామనుడు. అలంకారములకు మురియడు. “కావ్యం గ్రాహ్యం రసాత్” అనలేదు. “కావ్యం గ్రాహ్యమలంకారాత్” అనగలడు. రసము సుందరమనడు. “సౌందర్యమలంకారః” అనును. అలంకారాభిమానమున్నను వామనుడు గుణాభిమాని. “శోభాయాః కర్తారో ధర్మా గుణాః“ గుణములు వామనుని మతమున నిత్యములు. కాంతిగుణములో నాతడు రసమును పొదుపును. గుణములందే రససత్త యాతనికభీష్టము. అనిత్యగౌణధర్మములయిన యలంకారములలో రసమంతర్భవింపదు. నిత్యప్రధానములయిన గుణములందే రసమంతర్భావించును. ఇట్టి వామనుడు దండిభామహులకన్న నుదాత్తముగా నూహించి రసమునకుదాత్తమయిన యున్నతపీఠ మిచ్చినాడు. అయినను రసమునకీయవలసిన మహత్త్వమీయ లేదు, రీతికుక్షియందే సర్వము జీర్ణింపజేయుట కా వామనుడు యత్నించెను.

ఉద్భటుడు రసపోషణసంధాన మెఱింగిన కావ్యలక్షణసంధాత. రసవదలంకారమునందె రసము నాతడు సన్నివేశింపజేసెను. రసాదు లవికస్వరములై యయి యాతనికి గోచరించినవి. అయినను భామహాదులకన్న నీతడు రససన్నిధి చేరినాడు. శాంతరసముల్లేఖించుట, రసముల సంఖ్యానించుట, విభావాదుల వ్యాఖ్యానించుట ఉద్భటుని

శసదర్శనము సూచించుచున్నవి. ఉద్భటుడు భరతుని రససూత్రమును వ్యాఖ్యానించెను.

మీమాంసాదర్శనదర్శనుడు భట్టలోల్లటుడు నాటకప్రసంగమునను రసము చర్వణీయమని భావనీయమని భావించి "రసము నాయకనిష్ఠము" అనినాడు. రసమున జగజ్జీవనవ్యవహార మూహించినాడు. రసమున నుత్పత్తివాద మాతడభిమానించెను. స్థాయివిభావాదుల కుత్పాద్యోత్పాదకత చెప్పి తన యుత్పత్తిప్రియతను వ్యక్తము చేసినాడు. రసవిషయమున ఉత్పత్తి, అనుమితి, భుక్తి, నిష్పత్తిశబ్దార్థముగా లోల్లటుడనుట రసప్రక్రియాసన్నిధిలో నున్నటుల భావింపగలము.

రుద్రటుని రీతి స్వతంత్రము "సరసం కుర్వన్ కవిః కావ్యం" అనుచు కవిని ప్రశంసించెను. అతని రసయుక్తినిర్దేశము భావకులకు భావనమిచ్చును. రుద్రటుడు శృంగారవీరచేష్టితభేదముల చెప్పి రసభాగవిభాగములకు సూత్రపాతము సూచించినాడు. రస్యమానము సర్వము రసమని ప్రేయోరసమును పదవ రసమనినాడు. అట్లే స్నేహమును రసమగునేమో? ఏమో యననేల? భావసామాన్యము సమాస్వాద్యమై రసమగుట నాతడుల్లేఖించినాడు. కాని; "రసస్తు సౌందర్యాదివత్ సహజో గుణః"

శ్రీశంకుకుడు నైయాయికుడు. నాట్యవ్యాఖ్యాత, రసము విషయవిషయిగతమని యని నటీనటకౌశల ముగ్గడించి సహృదయులకు రసానుభూతికై యనుమితియోగమిచ్చి తన మార్గమున తాను సంచరించినాడు. సహృదయప్రేక్షకునకు నటునందు చిత్రతురగమునందు వలె విలక్షణప్రతీతి యుదయించును. సహృదయు డనుమితియోగియై యన్యానుమేయవిలక్షణముగా రస మనుమేయము చేసికొని యలౌకికానందము పొందును. శంకుకుని సౌందర్యభావన మన్యాదృశము. ఆతని నిష్పత్తి యనుమితి. లోల్లటునివలె రసము వాచ్యమనును, ఇట్టివారు రసములేని కావ్యమును చంద్రుడు లేని రాత్రిగ భావించిరి, కాని భామహాదుల దృష్టిలో రసతత్త్వ మప్రధాన మయినట్లు గోచరించును.

శ్రీమదానందవర్ధనోదయమున "కావ్యస్యాత్మా ధ్వనిః" యయినది, ధ్వనులలో రసధ్వని ముఖ్యము, ధ్వన్యమానము లయినను వస్త్వలంకారములు రసముననె పర్యవసించుట నానందుడు చెప్పి యానందమిచ్చినాడు. ధ్వని కావ్యాత్మ యయినను రసమె కావ్యాత్మ. రీతిగుణాలంకారాదులకు రసానుసారముననె స్వాత్మప్రతిష్ఠ యున్నది. రసానుసరణముననె కావ్యమున సమన్వయమున్నది, రసమయసూత్రమున సర్వమణుల స్థితి హారమై మనోహర మయినది. ఆనందవర్ధనమార్గము రసానందవర్ధినమార్గ మయినది. రసవిషయమున మనోవిజ్ఞానప్రక్రియలు చిత్తగతిసంశోధనములు సంవిన్మయతత్త్వ సమీక్షణము లందు పొడుకొనినవి. వ్యంజనాపద్ధతిని నిరూపించిన ధ్వనికారుడు వర్ణపదాదులందును రసవ్యాప్తిని గుర్తించినాడు. రసాక్షిప్తబంధమె యాతని కభీష్ట మయినది. అలంకారముల కలంకారత్వమును, గుణములకు గుణత్వమును రసముననె యాతడు సాధించినాడు, సంఘటన రసవ్యంజక మయినది. రసబంధాభినివేశముననె

రిచయిత ప్రవర్తింపవలసి యుండుట నాతడుపదేశించినాడు. అగ్నిపురాణనిర్ణయము-తన కనుకూలమయినది. రసమె ప్రాణము, ఇట్లనుటలో రసమున దర్శనతత్త్వసంపత్తి నాతడు గుర్తించి నట్లయినది. "చైతన్యం జ్యోతిః ఆనందః వ్యజ్యతే వ్యక్తిః చైతన్య-చమత్కారరసాహ్వాయః, వాగ్వైదగ్ధ్యప్రధానేఽపి రస ఏవాత్ర జీవితం" ఇట్టి భావన-మంతయు రససంవేదనము.

సాహితీరససిద్ధాంతవికాసము త్రివిక్రమ మయినది. రసమహత్త్వస్థాపనము-రసానుభూతిప్రక్రియలో వివిధవాదావిష్కృతి- రససంఖ్యానము. సదాశివుని యభినయసమావేశములోని రసావిష్కృతిని నాట్యవేదము నిర్దేశించినది. ఒకప్పుడు మనువు శాసనభారఖిన్నుడై సూర్యుని స్మరించినాడు. తన ఖేదము విన్నవించినాడు. ఒకప్పుడు బ్రహ్మయు నిల్లై యయినాడట! అప్పుడు విష్ణువు శంకరు నర్థించినాడు. శంకరుడు నందికేశ్వరుని పిలిచి అధ్యయన మొనరించిన రస వేదము బ్రహ్మకు చెప్పు మనినాడు. బ్రహ్మకు నాట్యవేదము తెలిసినది. నందికేశ్వరునకు రసేశ్వరానుగ్రహ మున్నది. ఇట్టిది భావప్రకాశన శారదాతనయ భావసూక్తి. రాజశేఖరు డిట్లా మోదియయ్యెను. "రూపకనిరూపణీయం భరతః రసాధికారికం నందికేశ్వరః"

బ్రహ్మనుండి భరతునకు లభించిన రీతికన్న బ్రహ్మకు నందికేశ్వరసంప్రాప్తము ప్రాచీనము. అది రసాభినయపద్ధతి. శారదాతనయు డింకను సంప్రదాయముల సూచించినాడు. వాసుకిసంప్రదాయము రిసపరివేషము కలదట. భోజదేవుడు రస-రాజ్యరాజు, రసవివేచనమున "సరస్వతీ కంఠాభరణము" కూర్చినాడు. రసాన్వయ-విభూతులు గుర్తించి సర్వము రసచక్రమున నిబంధించినాడు. అతని ఉక్తియుక్తి రసోక్తి యయినది. నవార్థము అగ్రామ్యసూక్తి శ్రవ్యబంధము స్ఫుటశ్రుతి అలౌకికార్థ యుక్తి రసమాహరించగలవని యాత డనును. "శృంగారప్రకాశము" శృంగార ప్రకాశమునకై ప్రకాశింపచేసి

"న హి బహవో రసాః అపి తు ఏక ఏవ శృంగారో రసః"

ఇట్లనగల రసభోజుడు భోజుడె. "రసోభిమానోఽహంకారః శృంగార ఇతి గీయతే" రసమూల మహంకారము. అహంకారము భావముల ననుభవింప జేయును. అహం-కారము, శృంగారము, రసము అన్నియు నొకటి. అహంకారమనునది రసపూర్వావస్థ. స్థాయిసంచారు లనంతరావస్థ. శృంగారేతరరసము లశృంగారములు. అవి మిథ్యాప్రవాదము లట! సర్వభావములకు కామనిష్పత్తిని నాట్యవేద మొకచో నాసూత్రించినది. భోజదేవభావము తన్మూలమై యుండునో! శృంగారము శుచియని మేధ్యమని యుజ్జ్వలమని భరతుడనుట భోజునకు బలము. రసదర్శనము భోజునకాత్మదర్శన మయినది. శారదాతనయుడు భోజదర్శనము రసదర్శనముగ భావించి అభినవశిష్యు డయినాడు.

భట్టాభినవగుప్తార్యపాదప్రోక్తేన వర్త్మనా
అయం ప్రబంధః కథితః ...............

శారదాతనయుని శారదాప్రసాదమును భావప్రకాశమునను వెనిరూపించెను. మమ్మటుండు రసవాదముల క్రోడీకరించి నిరూపించుట యభినవరసపతాక. ఇంతటి వారింతగా ననగా విశ్వనాథునకు ధైర్యము కలిగి — "వాక్యం రసాత్మకం కావ్యం" — అనినాడు. వాని తాతతాతఅద్భుతమె రసమనినాడట. రసానుభూతికై సత్త్వోద్రేకప్రకాశానందసంవిన్మయత యావశ్యకమని యా రసప్రస్తుతి భావించినాడు. పండితరాయల రసగంగాధరము రసగంగాధరము. రసవిషయమున జగన్నాథుడు రసజగములోని పదునాలుగువాదముల సారములను నిరూపించినాడు. నా నవరసగంగాధరములో నిది సముల్లిఖితమయినది. రసము స్వస్వరూపానందము. భగ్నావరణచిద్రూపము. "రసో వై సః" అను శ్రుతి ప్రమాణము. ఇట్లా మనసతరితీర్ణవిద్యార్ణవుడె యనగలడు. జగన్నాథు డద్వైతపథపథికుడు. రసరథమును లేన పథమునకు మరల్చికొనినాడు. అభినవగుప్తునకన్నను తనకొక్క విశేషము కలదనిపించుకొనుటకు యత్నించినాడు.

ఇంకను నవభావకు లింకను జెప్పిరి. నివృత్తిలో శాంతరసము ప్రవృత్తిలో మాయారసము వారలకు ప్రతిభాసించినది. "మాయారసమును రసమేనా?" యని వారు వీరనిరి. రసాధారమున కావ్యమభిముఖము విముఖము పరముఖము నగునట!. రసనిష్పాదకము రసాభిముఖము. రసము లేకున్న నది విముఖము. రసము లేకుండరాదు కాక గుణాలంకారరీతివృత్తిప్రధానమగునది పరముఖము. పాశ్చిమభావప్రభావితులు కొందరు మనోవిజ్ఞానము పేరిట కొంతగా మఱికొంతగా సమీక్షలు చేసిరి. భరతారంభముగా రెండువేల సంవత్సరములు రసప్రసరము జరిగినది. తత్పూర్వమెంతగా కాలగర్భము ప్రవేశింపగలము? అథర్వణవేదమునుండి రసము నాట్యమున జేరుటను నాట్యవేదము నిరూపించినది. రసోదయమున విశ్వోదయము విశ్వోదయమున రసోదయమును సంభావించుట సముచితము. భరతాభినవపద్ధతి చేరి యే విచారము నెట్లు చారసంచారము చేయవచ్చునో రసహృదయులు నిర్ణయింతురు. అందరసహృదయత పోనాడుటకే యీ చింతావివృతి.

అవంతిసుందరీనాథుడు రాజశేఖరుడు రసమాత్మ యనినాడు. హృదయదర్పణమున రసము దర్శించిన భట్టనాయకుడు రసమునకు దేశకాలవ్యక్తిపరిధులను తుడిచివైచి "రసము రసవిదు లందరిది" అన్న హృదయసంవాద మిచ్చినాడు. అతడు నాట్యవేదవ్యాఖ్యాత. సాంఖ్యమతానుయాయి. రసదర్శనము సాంఖ్యదర్శనము చేసినాడు. రసమున సాధారణ్యమొకటి సంభావించి యా సిద్ధాంతమున నవచైతన్యమును సచేతసుల కందించినాడు. రసము నాటకమునందే కాదు. కావ్యములందును గలదు. రసము నాయకునందుండదు. నటునందు లేదు. సహృదయునందుండును. రసనిష్పత్తి శక్తి కావ్యమునందున్నది. సహృదయునందున్నది. భట్టనాయకుని భుక్తిసిద్ధాంతము సహృదయులకు భోగమిచ్చి వారిని భోక్తలుగా జేసినది. అతని సాధారణీకరణ ప్రభావము రసజగమంతట వ్యాపించినది. కరుణము కూడ సంతోషజనకమయినది.

గుణాలంకారాదులు రసానుభూతిసంపాదకములని నాయకుడు వివేకమిచ్చినాడు.

శ్రీమదభినవగుప్తపాదుడు రసమహేశుడు. ఆతని నాట్యవివృతి అభినవభారతి. భరతమతసంవాదముతో నభినవభారతి రసబ్రహ్మపతాక యయినది. భట్టనాయకరసనివృత్తికి తాత్త్వికరూపసిద్ధినిచ్చి అభివ్యక్తివాదమున తానానందవర్ధనుడయినాడు. సాహితీవ్రతుల నందరిని రసభరతానందాభినవుల జేసినాడు. అర్వాచీనులందరును రసభిక్షు స్వీకరించినారు. మమ్మటుడు విశ్వనాథుడు విద్యానాథుడు జగన్నాథుడు సాహితీనాథు లందరు నభినవరసమున సనాథు లయినారు. అనభినవమెవడేని పలికిన నది యరసవచన మయినది. ధ్వనిరసముల సంశ్లేష మభినవవాణిలో నున్నది. కావ్యములో నాటకములో రససిద్ధి సిద్ధాంతిత మయినది. రసములు రసరూపమున రసమై మహారస మయినది. శాంతమె సిద్ధరస మయినది. రససిద్ధాంతము దర్శనసిద్ధాంత మయినది. ఆత్మానుభూతికై సుహృదయసహృదయులు తమహృదయమున స్థాయిసంస్కార ముల్లసితము చేసికొనిరి. విభావాదులును రసపరిణామమున నుపాదేయకోటిలో జేరినవి. దేశకాలవ్యక్తుల కతీతమయిన భావసామ్రాజ్యమును సాధారణ్యమహిమాతిశయమున రససామ్రాజ్యము సంభావించి సచేతసులందరు కావ్యసామాన్యమున మహారసాస్వాద మొనరింప ధన్యులయినారు.

అభినవు డభినవుడు. అభినవు డేమి చెప్పినాడు? అభినవుడేమి చెప్పలేదు? ఏమి చెప్పవలయునో యది చెప్పినాడు. సర్వము చెప్పినాడు. సర్వస్వము చెప్పినాడు.

భారతీయసాహిత్యతంత్రము రూపకమూలతత్త్వ మన్వేషించినది. ప్రశ్న సమాధులతో భరతసంకల్పము సఫల మయినది. సౌందర్యసంకల్పముగా రసము సాక్షాత్కరించినది. రససంవిధానస్వరూపమె రసవిషయమున భరతభావము నిర్దేశించును. సౌందర్యతత్త్వము సంకేతస్వరూపమున విభావాదుల నావిష్కరించినది. భిన్నభిన్నవిధముల రసప్రాధాన్యమును తత్సామగ్రీసంపదయె సూచించును. సౌందర్యాత్మ యనుకరణరూపము కాదనుట తత్త్వస్వభావము ననుసరించిన రసప్రతిష్ఠయె తెలిపినది. అనుభవికదృష్టి కలిగి రసవిమర్శ చేయవలయును. వాదదక్షుల వైయక్తికస్వభావములు విజ్ఞాననిర్ణయమున మానసరీతుల ననుసరించి ప్రమేయప్రమాణపరిధులను మీరజాలవు. అవిభాజ్యమయిన కళాత్మలో దోషరాహిత్యము దర్శించినవె యనపలాప్యమయిన సౌందర్యనిశ్చయము కలుగును. ఇట్టి యాత్మనిశ్చయమున శ్రీమదభినవగుప్తపాదుడు అభినవభారతీబ్రహ్మ యయినాడు. రసమయవిశ్వమంతయు నభినవగుప్తబ్రహ్మమయ మయినది.

## నాటకమీమాంస

స్వరూపవ్యాఖ్యానమునకె రసవ్యాఖ్యాన మంతంత యయినది. నాట్యమె రసమని రసమె నాట్యమని యభినవుడనె యనినాడు. “ప్రీత్యాత్మా చ రసః। తదేవ నాట్యం। నాట్యమేవ వేదః।” ఇత్యస్మదుపాధ్యాయః “లోచనము.” నాట్యరసోత్పత్తి

మవిధాన మదియొక ప్రతిభావిలసితము. "నాట్యవేదమున నాట్యరసము" అను సంజ్ఞా ప్రసిద్ధియు కలిగినది. నాట్యము రసోన్మీలనప్రధానసాధనము. ఇట్లనుట కావ్యరససిద్ధిని కాదనుటకాదు. నాట్యము రసోపకరణము లయిన విభావాదుల యభినయము నిర్దేశించి సహృదయుల హృదయములందు రసానుభూతి నాపాదించును. నాట్యమునందలి స్ఫురణము శ్రవ్యకావ్యమునందు నుదయించునేని రసాస్వాదము సంభవించును. ప్రత్యక్షసాక్షాత్కారము కవి యలౌకికవర్ణనశక్తిప్రభావమున సముత్పన్న మగును. శ్రవ్యకావ్యపదార్థము లభినేయకావ్యపదార్థప్రతిమములై యవభాసించును. అభినవగుప్త నాట్యగురువు భట్టతోతుడు;

"కావ్యేపి నాట్యాయమాన ఏవ రసః
కావ్యార్థవిషయే హి ప్రత్యక్షకల్పసంవేదనోదయే రసః"

అనినాడు. "ప్రయోగత్వమనాపన్నే కావ్యే నాస్వాదసంభవః" అనియు ననినాడు. రూపకరమణీయత కవిజన్యమా? నటజన్యమా? ఒకచో కేవలప్రతిభావిలాస ముండును. వేరొకచో నభినయకలాసంవలితచమత్కార ముండును. వర్ణనాప్రధాన మది. ప్రయోగప్రధాన మిది. అపశ్చిమభావులు — కావ్యములోని కవికల కన్న నాట్యములోని నటకల సమధికమని యంగీకరింతురా? అభినవుడు పలికిననె పలుకుబడి ముండును. కవిహృదయగుప్తభావమును నటుడు వ్యాఖ్యాతగా నభినయించుననుట నభినవుడొల్లడు. అందుననె భోజదేవుడు;

"అభినేతృభ్యః కవీనేవ బహుమన్యామహే"

అనినాడు. ఇంకను నాటకముకన్న కావ్యమె కమనీయమని యాతడు బహుమానించును. భోజుడభినవు భావమున నెట్లు భావితుడు వాసితు డయినాడో నాట్యవేదము చూచి గుర్తింప వచ్చును.

శ్రవ్యనిర్మాత కవి. రూపకరచయితయు కవి. పశ్చిమభావు లన్యథా తలచ వచ్చును. కాని యీతడు కవి. సహృదయుల హృదయములలో నవిలంబముగ రసోన్మీలన మొనర్పగల యలౌకికస్థితిని కవి కథనమున చిత్రణమున సంపాదించును. రూపకమున గూడ నిదియె కార్య మిదియె ధ్యేయము. కాని నటుడు ద్వారమున నుండును. రసానుభూతికై పామరుడు ప్రయోగ మపేక్షించును. అపామరు డపేక్షింపడు. పఠనముననె యాతడు రసోద్బోధము పొందగలడు. ఆతని హృదయమున స్థాయిసంస్కార ముండుట చాలును. వానికభినయాపేక్ష యుండదు. నాటకమహత్త్వము కవిప్రతిభావిలాసము. నటుని యభినయకౌశలచమత్కారనిమిత్తకము కాదు. అభినయ మంధయష్టి. ఉదాత్తనాటకము సామాన్యనాటకము వలె అభినయసాపేక్షము కాదు. సచేతస్కుడు హృదయ మణిద్వీప భవనరంగమున సర్వము సాక్షాత్కరించుకొనును. ఇట్టి నాట్యకావ్యవైశిష్ట్యమును అరిస్టాటిలు డామోదించినాడు. తలస్పర్శి విమర్శ మొనరింపగలరన్న విఖ్యాతి వహించిన పాశ్చాత్త్యులు రంగశాలలలో నభినీయమానాపాతసుందరములగు రూపకముల కన్న భావ్యమానప్రౌఢసుందరములగు పాఠ్యరూపకములనె

ప్రశంసించినారు. భావనాప్రౌఢు లందరక్లై భావింతురు. కావ్యము నాట్యదూర మగుట కాని నాట్యము కావ్యదూరమగుట కాని నాట్యసూత్ర మాసూత్రింప లేదు. అభినవగుప్తబ్రహ్మ సర్గబంధమున గూడ సంధిపంచక మపరిహార్యమనుట నవోత్తేజ మీయగలదు. రూపకనిరూపణము భరతుడే యందికొనుట బంగారుపంట యయినది. అభినవగుప్తుడు జాత్యరత్నముల పొదిపి రససూత్రమున గూర్చి సాహితీశ్రీ హృదయ హార మొనరించుట హృదయము కలవారలకు హృదయహారి యయినది.

శ్రీమదభినవగుప్తుడు త్రైజసచక్షువు. అన్నిరూపకములు చూచినాడు, బహుద్రష్ట. సర్వవిశేషము లాలించినాడు. బహుశ్రుతుడు. ఆ వినుకలి ఆ కనుకలి నాట్యమున నాకలికలవారలకె కలుగును. ఆతడు చూచినవి మనము చూడము, రూపకలక్షణములను రూపకములం దాతడు సమన్వయించినాడు. లక్షణసంబంధమున నవి యట్లుపాదేయములయినవి. లోకమట్టివానిని రమ్యతకలవానిగా భావించుచున్నది. ఈ లక్షణసంపద వలననె యవి యట్లు రమ్యములయినవని గుర్తింపజేయుట కభినవుడు మనకు నాట్యమున నవనేత్ర మిచ్చుచున్నాడు. తాపసవత్సరాజము, రత్నావళి, నాగానందము, రాజరూపకములు. వీని ననేకపర్యాయము లభినవుడు లక్షణసంగతికై యుల్లేఖించినాడు. రాజనాటకాభినందన మింతగా నున్నదది గుణవత్తాకృతము. రాజప్రశంస లోకాదరపాత్ర మని భావించుట భావించుట కాదు. ఆత డభినవుడు. కేవలరాజప్రశంస నాతడు గురువులకడ నేర్చికొనలేదు. కృతియగు గురువు కృతి నభినందించుటనె అభినవసుకృతికి నాట్యవిద్యోపదేశమున నందించెను. శాకుంతలము, విక్రమోర్వశీయము, ఉత్తరరామచరితము, వేణీసంహారము, ముద్రారాక్షసము, దేవీచంద్రగుప్తము, ప్రతిభాచాణక్యము, కౌముదీమహోత్సవము, వాసవదత్తాపహారము, పుష్పదూషితకము, పాండవానందము, రామాభ్యుదయము, కృత్యారావణము రూపకముల నుండియు సమన్వయము ప్రదర్శించుట యంతయు తద్గౌరవప్రశంసయె కాదగును. విభిన్నరూపకములలో విభిన్నసంధ్యంగము లున్నవి. సంధ్యంగములను వరుసగా నె కూర్పవలె నన్న నియమము లేదు. అట్లుంట సుందరమును గాదు. అసుందరమును గాదు. అంతయు కథాపేక్షము. సుందరసంబంధగతినె యభినవులు సూచించిరి. సంధ్యంగములలో నన్నియు నావశ్యకములును గావు. అనావశ్యకములును గావు. ఔచిత్యాపేక్షమున గొన్నియె ముఖ్యములు. అన్నియు ముఖ్యములు. వస్తుగతస్వరూపరమ్యత ననుసరించి కొన్నిసంధు లొకచో నపేక్షితములై ప్రధానములు కాగా మరి కొన్ని మరియొకచో నావశ్యకములై ప్రధానము లగును. ఆ సంధియంగములుగా పరిగణితములయిన ఆసంధ్యంగము లా సంధియందే యుండవలయునన్న నియమమును రూపకనిర్మాత లుల్లంఘించుటలో తత్సమయవైచిత్ర్యమె హేతువు. ఇట్లనేకవిధముల చమత్క్రియ లున్నవని యభినవుడనేకరూపకములనుండి యుదాహరణము లిచ్చెను. ఇవి యన్నియు నెక్కెట్లు రమణీయతాస్పదము లయినవో వ్యాసంగనిరతులు సమీక్ష చేయుట పరమావశ్యకము. కాని యభినవోదాహృతము లయిన రూపకములు కొన్ని

నెడు కానరావు. ఉన్నవానిని జూచు కన్నును మాంద్యము వీడి సమున్మీలితము కాలేదు. లక్షణదృష్టితో వానినన్నిటి నేకవాక్యతకు దెచ్చికొని పరిశీలించినచో నొక లక్షణసుందరనాటకము వ్రాయవచ్చును. ముద్రారాక్షసము సర్వలక్షణసుందర మసుందరమని యెవరందురు? విశాఖదత్తుని దేవీచంద్రగుప్తము ప్రతిభాచాణక్యము ఎంతసుందరముగా నుండునో చూడవలెనన్న కాంక్ష ముద్రా నాటక ముద్రాముద్రితుల కందరకుండును. "మృచ్ఛకటికము సుందరము. అందు లక్షణములు సంగతములు కాకపోవచ్చును. అయినను సుందరతకు లోటురాలేద"ని మనసులోని యొక వికల్ప మాశంకాసంకులపంకిలము కావచ్చును. కాని లక్షణసంగతియు నున్నచో మన్ను బండియు మిన్నుబండి యయ్యెడిది. "తాదృశసమీక్షణమున లక్షణనిర్మాణ మొన రింపరాదా?" యనునది చోద్యము కారాదు. తత్కాలప్రచలితములయిన కతిపయ నాటకములను దృష్టికందు మేరలో నుంచికొని కొన్నిటిని కొన్నిటిలో సమన్వయించుట కభినవుడు యత్నించెననుట ఆ యభినవ కాలపు మాట కాదు. ఈ యభినవకాల వచనము. ధ్వన్యాలోకములో ధ్వనికారుడును కొన్నిటినె సమీక్షాయోగ్యములని తలచెను. అవి లబ్ధప్రతిష్ఠాకములు. సంప్రాప్తస్వరూపసత్తాకములు. ప్రాప్తయశస్సుందరు లప్పటికే కలరు. వారి దోషోద్ఘోషణ మాత్మదోషోద్ఘాటన మనియె మన్నించెను. దాన వాని సర్వదర్శిత నాక్షేపింపలేముకద! "ఆలోకమున లోచనోన్మీలన మొనరించిన యభినవభారతీపరమేష్ఠి అభినవగుప్తపాదుడు సమన్వయసంపత్సుందరములనె సమున్మేషించెను." ఇట్టిభావనమె సంభావనము, నాటకీయాంశవ్యాఖ్యానములో ననేకుల భావముల నభినవుడు విక్షేపించినాడు. అయినను కొంద రట్టివానిని పట్టి వ్రేలాడుట అనభినవార్థవిజ్ఞానము. నేటి తెలుగునాటకములలో నీ సమన్వయము నే నేల చూపరాదు? తెలుగు నాటకములలో లక్షణసంగతికాంక్ష రచయితలకె లేదు. నే నెట్లు దర్శింపగలను? "పోనీ! అనూదితనాటకములనుండి యుద్ధరింపరాదా?" అని యనుకొనవచ్చును. అప్పుడు తదనువాదకస్మృతి రాగా నప్పటి బుద్ధ్యున్మేషములో "వారలకట్టి పరిచితి నేన యాపాదించినవాడ నగుదునేమో?" యని జంకితిని.

పశ్చిమదేశీయనాటకసాహితీమర్యాదలు భారతమున నిలుకడ కలవి కా గలవని తలచలేము. ఇంతకాలముగా నింతగా వానివిషయముల గుర్తించిన వారును వానిని మన కందింపలేదు. భారతీయహృదయదర్పణమున నవి బింబింపవని వారు తలచి యుందురేమో? భారతీయలక్షణ విలక్షు లయినవారు అలక్ష్యముగ లక్ష్యము నిర్మించిరి. అది భారతీయసమీక్షాపరీక్షాదూర మయినదె కాని యూరపీయ సమీపగామి కాలేదు. దాని యం దదియు లే దిదియు లేదు. "ఇది లేకపోవుటయ చాలునని వారు త్రేణ్చిరా?" యనుకొందమన్న నది భావదాస్యపరాహతిప్రతీకము. మోమోటమి లేక పాశ్చాత్యులభినందించుటకర్హములయిన కృతు లాకృతి వహింపలేదు. లక్షణదక్షతారమ్యములయిన సంస్కృతరూపకముల వారు నోరూరగా నేటి కభినందించుచునె యున్నారు. నేటికట్టి యభినందనీయాభివందనము పొందుట కభినవాభినందన మె

దయానందకందము. నేడు ప్రచలితభావుల దృష్టిలో భారతీయలక్షణములు జారినట్లుం డును. పునర్నవీకరణములో నీ యాత్మ బాధ రాదు. నవవ్యవస్థ కభినవాస్థ సహకారి. రసాభివ్యక్త్యపేక్షాసముచితముగనె సంధిసంధ్యంగసంఘటనమును సాహితీదేశికు లుపదే శింతురు. శాస్త్రస్థితిసంపాదనేచ్ఛను వా రభినందింప లేదు. వేణీసంహారములో భట్ట నారాయణుడు ద్వితీయాంకమున విలాస మను ప్రతిముఖసంధి యంగమును కూర్చినాడు. దుర్యోధనుడు భానుపూజాసక్త యయిన భార్య భానుమతిని కామచారమున స్పృశిం చును. వృత్తగోపనము లేక స్పష్టముగ సమాగమసమకాలికసన్నివేశముల స్మరించి స్మరించి సంకీర్తనము చేయును. పెనుగాలి చుట్టుకొనగా తా నామెను చుట్టుకొని ప్రాసాదమున కేగును. నిన్నటి యంతఃపురవిహారమె బాగులేదని కంచుకి తలచెను. నే డీ సమయమున నీ యీహ యేమి? అయినను నారాయణభట్టు వర్ణించెను. ఏల వర్ణించెను? అయుక్తమని తెలిసియు వర్ణించెను. అటు భీము డిటు దుర్యోధనుడు, ఇద్దరి స్వభావవివేకమున కిట్లు వర్ణించెనా? "దుర్యోధనుడు దైవవ్యామోహితు" డనిపించుటకు వర్ణించెనా? శాస్త్రస్థితిసంపాదనేచ్ఛతో వర్ణించెను. ఇట్లు తలచుటయ తప్పు. "రత్యర్థేహా విలాసః" అని విలాసలక్షణము, కాని వీరముఖ్యనాటకములో ఉత్సాహార్థేహ యుండవలెను. దీని గుర్తింపక భట్టనారాయణుడు భట్టు అయి తిట్టు పడెను.

యథాసంధి తు కర్తవ్యాన్యేతాన్యంగాని నాటకే
కవిభిః కావ్యకుశలైః రసభావమపేక్ష్య తు.

అని భరతభారతి. "నేనభినవగుప్తపదారాధకుడ" నని సానందముగ పలుకు శారదా తనయుడు;

"న కేవలం రసో నైవ లక్ష్యం నైవ చ లక్షణం
స నాయకస్యైవోత్కర్షో వర్ణ్యః సుకవినా క్వచిత్
కథాశరీరం సర్వేషామానుగుణ్యేన కల్పయేత్"

అని యనును. కథ శరీరము. రస మాత్మ. శరీరమున సంధిపంచక మున్నది. సంధ్యంత రము లున్నవి. సంధ్యంగము లున్నవి. సంధిబంధము సుశ్లిష్టముగా నున్న నే యాత్మో ల్లాస మున్నది. ఇది యంతయు నాత్మయోగుల భావోల్లాసము. కావ్యాత్మయోగు లిట్టి సమన్వయమునె సాహిత్యతంత్రమున దర్శించిరి. హృదయము లేనపుడు వీనిని కాదనవలెను. కావ్యనాట్యభావుకులు సహృదయులు కదా!

కవి పురుషార్థోపాయవ్యుత్పత్తిని కూర్పవలెను. రసాస్వాదమయమయిన హృద యానుప్రవేశము సూచింపవలెను. రసోచితవిభావాదుల కూర్చినచో రసాస్వాద వైవశ్య ముదయించును. అప్పుడు స్వరసముననె వ్యుత్పత్తి కలుగును. ఇట్లు ప్రీతియె వ్యుత్పత్తిప్రయోజక మగుచున్నది. ప్రీతివ్యుత్పత్తులు రెండును ఏకవిషయము లగుట వలన భిన్నరూపములనరాదు. రసోచితవిభావాదిస్వరూపవేదనము ఫలపర్యంత ముండును గావున "వ్యుత్పత్తి" యనదగును. పురుషార్థోపాయక్రమమున ప్రవర్తించు

శానికి సిద్ధి యున్నది. అనుపాయద్వారమున ప్రవర్తించువానికి నాశమే. కాగా నిట్లు నాయకప్రతినాయకగతముగా అర్థానర్థోపాయవ్యుత్పత్తి నిబంధింప వలెను. ఉపాయ మాశ్రయింపగా నయి దవస్థలు కలుగును. అభినవభాషలో నవి;

స్వరూపం, స్వరూపాత్కించిదుచ్ఛూనతాం, కార్యసంపా
దనయోగ్యతాం, ప్రతిబంధోపనిపాతేనాశంక్య
మానతాం, నివృత్తప్రతిపక్షతాయాం బాధకబా
ధనేన సుదృఢఫలపర్యంతతాం"

యయిదవస్థలు పొందును. ఈ యవస్థాసంపాదకమగు ఇతివృత్తము పంచధా విభక్తమయినది. ఇతివృత్తఖండము లయి దన్వర్థనామమున ముఖప్రతిముఖాదు లయినవి. ఆ సంధులకు స్వనిర్వాహ్యమున క్రమముండుటచే నవాంతరభిన్నము లయిన యితివృత్త భాగములు సంధ్యంగము లయినవి. ఇట్లున్న సంధితదంగముల నెవడు నిరూపింపడు! ఇంకనందలి గాఢగూఢవిషయముల వినివేదన మీ యా క ర మ న నాకారముతో నున్నది. వీని యననుసరణమున ననర్థ మనుసరణమున సుశ్లిష్టత యున్నది. నాటకము కాని కావ్యము కాని గద్యము కాని పద్యము కాని యీ రీతి సంధిఘటన మావశ్యకము. ఇది యంతయు కవికౌశలకర్మ. ముద్రారాక్షసనాటకములో విశాఖదత్తుడు నాటకకర్తృక్లేశమును రాక్షసముఖమున నిట్లు నిరూపించినాడు.

"కార్యోపక్షేపమాదౌ, తనుమపి రచయంస్తస్య విస్తారమిచ్ఛన్
బీజానాం గర్భితానాం ఫలమతిగహనం గూఢముద్భేదయంశ్చ
కుర్వన్ బుద్ధ్యా విమర్శం ప్రసృతమపి పునః సంహరన్కార్యజాతం
కర్తా వా నాటకానామిమమనుభవతి క్లేశమస్మద్విధో వా"

రాజనీతివిదుడు మొదట కార్యోపాయము కూర్పవలెను. పిమ్మట కార్యబాహుల్యము చూడవలెను. అనంతరము ఫలోన్ముఖము లయిన సాధనముల గూఢఫలము ప్రకట మొనర్పవలెను. "దీనినిట్లు చేయతగునా? తగదా?" యని సందేహించి సమీక్షింప వలెను. ఆ పిమ్మట విస్తృతమయిన కార్యజాతమును ప్రకాశమగునేమో యని యుప సంహరింపవలెను. ఇట్లు నీతిప్రయోక్తకష్టమనుభవించుట లోకప్రసిద్ధము. ముద్రా నాటకము విశిష్టనాటకము. తదీయవిశేషములు నాటకీయకార్యశృంఖలానుబద్ధములు. విశాఖదత్తుని లక్షణప్రియత్వము విలక్షణము. ఈ యంశమునె పంచమాంకములో ముఖల నిట్లు చెప్పినాడు.

ముహుర్లక్ష్యోద్భేదా ముహురధిగమాభావగహనా
ముహుస్సంపూర్ణాంగీ ముహురతికృశా కార్యవశతః
ముహుర్భ్రశ్యద్బీజా ముహురపి బహుప్రాపితఫలే
త్యహో! చిత్రాకారా నియతిరివ నీతిర్నయవిదః

నయవిదుని నీతి, నియతి వలె చిత్రమనుట యిందలి కథార్థ మయినను రూపకాంశపర ముగా గూడ నిది సమన్వయము పొందుటను ముద్రాకవి యభిలషించియె యట్టిపదముల

ప్రవేశ మభిమానించినాడు. నయవిన్నీతి ప్రాకరణికము. అందలి ప్లుతవిప్లుతగతులన్య విరుద్ధములుగా గోచరించు వానిని ఏకకార్యప్రవణములను నిర్దేశించుట యావశ్యకము కదా! వస్తుశరీరములో నట్టి గతులారున్నవని యిది షణ్ముఖ మయినది. నియతిగతి శతముఖము సహస్రముఖము కావచ్చును. అం దియత్త లేదు. కాని దాని షట్ప్రజ్ఞా ముఖముగ నిరూపించుట చాలును. సంధిబంధసంధానములోని గతిచిత్రత చెప్పనలయు కవీష్టము. పరమరమణీయార్థము నభివ్యంగ్య సారముగనె వాణిగల సుకవులందింతురు. నాటకీయార్థము రాజనీతివిషయములందే సంగతముగ గోచరించు ననుకొనము. ఇతరము లందు నున్నది. తాపసవత్సరాజములో "అదో మానపరిగ్రహేణ......సమాలంబతే" (నాట్యవేదము 304-305) అను పద్యములోని భావమిట్లె భావింపదగియున్నది. ఇట్టి సమీక్షయె ఆ పద్యమును వివిధముగా భావింపు మనినది.

అన్నమయాదిపంచదేహాత్మకు డయిన మానవుడు సర్వదేహాతిక్రమమున సంవిన్మయుడై యాత్మసిద్ధి పొందవలసియున్నది. విశ్వమయస్వభావమున నుండియు విశ్వోత్తీర్ణుడు కావలసి యున్నది. జననమాదిగా సిద్ధిపర్యంత మాతడు జ్ఞాతముగా నజ్ఞాతముగా మహాయానము మహాధావన మొనరించుచునేయున్నాడు. అట్టి యాతని ప్రస్థానములో నెన్నియో గతిచోదకము లగును. గతినిరోధకములు నగును. అన్నిటిదాటి యాతడాత్మసిద్ధిపొందితీరవలయును. ఆహూతుడయ్యు పరాహూతుడయ్యు నాతడు గమ్యమధిగమింపవలయును. ప్రాప్యము సన్నిధిలో నుండగా ననుకూలప్రతికూలము లన్నియు నేకార్థప్రవణము లగును. అలోకాలోక మాతనికి స్ఫురించును. అప్పు డమృతము విష మయినది. ఇప్పుడు విష మమృత మగును. జడము చేతన మగును. స్వరూపసంవేదనఫల మనుభవించును. అది యాతని మహాఫలసంవిత్తి. మహారసభోగము. ఈ యర్థమును తాపసవత్సరాజమున ముద్రానాటకమున నా యా పద్యములలో సంగతి మొనరించుకొనగలము. మహారసభోక్త నాయకుడు. స్వభావగతనానాభావప్రతీకప్రాయముగా నున్న నానాపాత్రవ్యవహారముతో నూయెల లూగియూగి మహాసమావేశమున స్వసంవిద్విశ్రాంతి పొందును., ఇది భారతనాటకతత్త్వము. ఇది భారతకావ్యరహస్యము. ఇది నాట్యోపనిషత్తత్త్వము. ఈ తత్త్వవ్యాఖ్యాత అభినవుడు "నమ స్తస్మై".

"రసరహస్య నిదర్శన సంస్రవ
న్నవసవామృతసార రసోల్బణాం
సుకృతినో రసయంతు భవచ్ఛిదే
స్ఫుటమిమాం రసనాట్యవిమర్శినీం"

మాధవరామశర్మ.

# ర స భా ర తి

మహాత్ములు మహర్షులు పూర్వరంగ విధానము సమాదరముతో వినిరి. మఱల భరతు నడిగిరి. పూర్వరంగ ప్రసంగముగా రసమని యంటిరి. వచన మాత్రమున నేమియు దెలిసినట్లు కాదు. అంతయు నాట్య గతముగా నిర్ణీతము కావలయును. "భవిష్యతియుగే ప్రాయో భవిష్యంత్యబుధా నరాః" భవిష్యత్కాలమున సామాన్యముగా నరు లబుధు లయ్యెదరు. వారల కిది సుగోచర మగుటకై నాట్య సంగతముగా మీరీ యంశముల విశద పఱుప వలెను. మేము కొన్ని ప్రశ్న లడుగుదుము. వాని సమాధానము మీరు సెలవిండు !

ఋ షు ల ప్ర శ్న

౨౧౨. యే రసా ఇతి పఠ్యంతే నాట్యే నాట్య విచక్షణైః
రసత్వం కేనవై తేషా మేత దాఖ్యాతు మర్హసి
౨౧౩. భావాశ్చైవ కథం, ప్రోక్తాః కింవా తే భావయంత్యపి
సంగ్రహం కారికాం చైవ నిరుక్తం చైవ తత్త్వతః

నాట్య విచక్షణులు నాట్యమున రసములని పఠింతురు. రసమన నేమి ? వానికి రసత్వ మెట్లు సిద్ధమయినది ? ఆయా ప్రసక్తిలో భావముల సూచించినారు గదా ! వాని నేల సూచించినారు ? వాని నెట్లు చెప్పినారు ? ఏల చెప్పినారు ? భావము లెట్లుత్పన్నము లగును ? అవి భావింపజేయునవె యగునేని వేనినవి భావింప జేయును ? ఈ విషయ ప్రఘట్టమున సంగ్రహ ముపదేశింపుడు. కారిక నిరూపింపుడు. నిరుక్తము ప్రతిపాదింపుడు. యథాతత్త్వ మీ సర్వస్వ మాదేశింపుడని మహర్షుల వచన సార సంగ్రహము.

దీని తత్త్వ మిది. మొదట నాల్గు వేదముల నుండి నాలుగంశములు స్వీకరించినట్లు స్పష్టమయినది. అందు పాఠ్యగీతములు సుప్రసిద్ధ స్వరూపములు. అభినయము కూడ — మహాగీతములం దర్థముల సమ్యక్కే అభినయము నిర్దేశించుట బట్టి అర్థప్రాప్తి కభినయము నిర్ణీత మయిన దనుట బట్టి — యొకవిధముగా వచన బలమున హృదయంగమ మయిన రూపము సూచితమయినట్లె. ఆథర్వణమున రసముల స్వీకరించితి మనుట విశదము కాలేదు. లోకమున మధు

ప్రకృతిలో గాని వికృతిలో గాని సంబంధమున్నట్లు తెలియదు. శృంగార రస సంభవమని, రౌద్ర రస శ్లోకమని, రస శబ్దమున కూర్చి పలికిన పలుకు లున్నవి. శృంగారము మొదలగు నవి రసము లెట్లగును ? వానికి రసమను నామమెట్లు సిద్ధ మయినది ? రసనేంద్రియముచే గ్రాహ్యమగు దాని విషయమున రసశబ్దము ప్రయోగించుట లోకమున ప్రసిద్ధముగా నున్నది. ఈ యర్థ మనాదర స్థానమని యెట్లందుము ? అవిచారితముగా దీనిని నెట్లుపేక్షింతుము ? లోకభిన్నులు రసభావములం దభిన్నులగుదురని యాదరాతిశయ ప్రతీతి యున్నది కదా ! రసమని యంటిరే ! రస శబ్ద మెట్లు ప్రాదుర్భవించినది ?

## భావ ప్రశ్న

భావమేమి? పూర్వము భావశబ్ద మపఠితము. అపఠిత భావము లేల సూచితము లయినవి? పాఠ్యాదులె భావము లగునా? అట్లయిన నాదరింప దగినవే యగునను కొందము. వాని రూప మేమి? మాకిది విస్మయముగ నున్నది. "భిన్నులయిన" యని యనిన స్థలమున రస సహ భావమున గొన్ని భావముల జెప్పినారు గదా! వాని నే విధమున జెప్పినారు? "జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్" యనుచోట భావ నామమేని వినలేదు గదా! కొన్నిట వీనిలో భావ శబ్దమును ప్రవర్తింప జేసితిరి. ఆ భావశబ్ద మెట్టిది? "భవతీతి భావః" "భావయ తీతి భావః" ఈ రెంటిలో భావవ్యుత్పత్తి యేది? భావము లుత్పాదించునవియే యగునా? అవి వ్యాపించునవి యగునా? వేని నుత్పాదించును? వేని వ్యాపించును? ఆ యుత్పాదన వ్యాపనము లందలి కర్మయేమి? ఇట్లనేక విధముల ప్రశ్నలు కలుగు చున్నవి. వీనిని క్రోడీకరించిన యయిదు ప్రశ్నలగును. ఈ పంచ ప్రశ్ని మొదటి నుండి యుండనే యున్నది. ఇప్పుడు విస్ఫారించితిమి. మీరు సంగ్రహముగా నేని సమాధానింపుడు! అని ముని కాంక్ష. ఆ ప్రశ్న పంచకము నీ విధముగా నుల్లేఖింప వచ్చును. రస విషయమున నొక ప్రశ్న. భావ విషయమున నాలుగు ప్రశ్నలు. మొత్తమయిదు.

౧. రసములని వ్యవహారము పొందిన రసములకు రసత్వ మెట్లు సిద్ధమగు చున్నది?

వ్యాపారమున విశద మగును. ఇది యొక గహన మార్గము. అయినను పరిజ్ఞానమున కిదియె గతి. ప్రతిపదము ప్రత్యంశము నిరూపణ మేమాత్రము శక్య క్రియ కాదు. వ్యాకరణాది శాస్త్రము లనేకము లున్నవి. చిత్ర పుస్తాది కర్మ నిరూపకము లయిన శిల్పముల కంతమె గోచరింపదు. నాట్యాంగమే యొక్కటేని జ్ఞానార్ణవము. తన్నిశ్చయ మేమాత్రము శక్యము కాదు. ఒక నాట్యాంగమునకె యెన్నియో యంగము లున్నవి. వాని భావ తత్వ విస్తరణ మశక్యము. ఒకొక్కటి తెలియుటయే సముద్ర మీదుట. అన్నిటి యధిగమన మేరికి నశక్యము, కాని యొకటి కలదు. నైరాశ్య మక్కఱ లేదు. సంగ్రహాదికము తద్విజ్ఞానమున సదుపాయము. ఇదిగో! నాట్య విషయార్థ సంగ్రహము నిరూపింతును. సంక్షిప్తముగా గ్రహించి యుద్దేశింతును. రసభావాదికము నాట్యమున ప్రాధాన్యము వహించు చున్నది. కాన రస భావాది సంగ్రహము నిరూపింతును. అది యనుమాన ప్రసాధక మగును. చక్కగా నన్యార్థముల నభ్యూహించుటకు శక్తి నిచ్చును. ఆశ్రయా సిద్ధ మనిపించదు. పక్షధర్మత నందించి యంగపోషక మగును. అల్ప సూత్ర గ్రంథార్థముగా ప్రవచనము చేయుదును. సూత్రముగా భాష్య గ్రంథముగా నర్థము వివేచనము చేయుదును. లక్ష్యము పరీక్షించి యన్వేషింప వలసి యున్నట్లు నిరూపించుట యల్ప సూత్ర రచన. అది సంకుచితము. నామ మాత్రముననె యది యుద్దిష్ట మగును. ఇట్లు నిరూపించినను తపోధనులు మీరు గుర్తింతురు. సంగ్రహ మిట్టిదని నేనె యనుట కాదు. అన్యులు ననిరి.

నా ట్య స ం గ్ర హ ము

౨౧౩. విస్తరేణోపదిష్టానా మర్థానాం సూత్రభాష్యయోః
నిబంధో యః సమాసేన సంగ్రహం తం విదు ర్బుధాః

౨౧౪. రసా భావా హ్యభినయా ధర్మీ వృత్తి ప్రవృత్తయః
సిద్ధిః స్వరా స్తథా తోద్యం గానం రంగశ్చ సంగ్రహః

సూత్ర మనునది లక్షణము. భాష్యము తద్వ్యక్తీకరణ రూపమయిన పరీక్ష. ఇట్టి సూత్ర భాష్యము లందు విస్తరముగ నుపదిష్టము లయిన యర్థముల నిశ్చిత దృష్టితో సంగ్రహముగ నిబంధించుటను సంగ్రహమని బుధు లనినారు. నేను నట్లె చెప్పుదును. అందుననె యల్ప సూత్రగ్రంథార్థ మంటిని. అల్పములగు సూత్రగ్రంథము

లీయర్థమున నున్నవి. ఆయర్థ మిందున్నది. ఇట్లు ప్రాక్తన సంవాద మున్నది. రసము, భావము, అభినయము, ధర్మి, వృత్తి, ప్రవృత్తి, సిద్ధి, స్వరము, ఆతోద్యము, గానము, రంగము అనునివి సంగ్రహము.

రసము నాట్యమున రసము లెనిమిది యనిరి.

| | | |
|---|---|---|
| శృంగారము | హాస్యము | కరుణము |
| రౌద్రము | వీరము | భయానకము |
| బీభత్సము | అద్భుతము— | |

భావము: స్థాయిభావము లెనిమిది

| | | |
|---|---|---|
| రతి | హాసము | శోకము |
| క్రోధము | ఉత్సాహము | భయము |
| జుగుప్స | విస్మయము— | |

సంచారిభావములు ముప్పది మూడు

| | | |
|---|---|---|
| నిర్వేదము | గ్లాని | శంక |
| అసూయ | మదము | శ్రమము |
| ఆలస్యము | దైన్యము | చింత |
| మోహము | స్మృతి | ధృతి |
| వ్రీడ | చపలత | హర్షము |
| ఆవేగము | జడత | గర్వము |
| విషాదము | ఔత్సుక్యము | నిద్ర |
| అపస్మారము | సుప్తము | విబోధము |
| అమర్షము | అవహిత్థ | ఉగ్రత |
| మతి | వ్యాధి | ఉన్మాదము |
| మరణము | త్రాసము | వితర్కము |

సాత్వికభావము లెనిమిది విధములు.

| | | |
|---|---|---|
| స్తంభము | స్వేదము | రోమాంచము |
| స్వరభంగము | వేపథువు | వైవర్ణ్యము |
| అశ్రువు | ప్రలయము. | |

అభినయములు నాలుగు రీతులు

| | |
|---|---|
| ఆంగికము | వాచికము |
| ఆహార్యము | సాత్వికము |

రెండు విధములు.

౧. లక్షణ రూప మయిన యర్థము కారిక.
౨. లక్షణ రూప మయిన యర్థమునకు వాచకమగు సూత్రము కారిక.
౩. ఆ సూత్రోద్దేశమున ననుపఠిత మగు శ్లోకము కారిక.
౪. లక్షణీయార్థ ప్రకర్షమును ధర్మ్యంతర వ్యవచ్ఛేదమును ప్రదర్శించు ధర్మము కారిక.
౫. జ్ఞప్తి సాధకము కారిక యని పిండితార్థము.

నానా నామాశ్రయోత్పన్న మిత్యాదికము నిరుక్త లక్షణము. శ్లోకద్వయము నిరుక్త స్వరూపమును జెప్పును. అనేక వ్యక్తి భేద భిన్నమయిన యర్థము లక్షణీయము. దాని సూచించు నర్థము లక్షణాత్మక మని నిశ్చితము కదా! అందు కొన్ని యాక్షేపములు తత్ప్రతి సమాధానములు నుండును. తన్నిరూపణ పురస్సరముగా తత్త్వము స్థాపిత మయినచో నది తత్పరీక్షా రూపమయిన నిరుక్త మగును. లక్షణ మనునది కేవల పరిభాషా మాత్రము కాక విచారణాత్మకమని వివేచించి యాక్షేప సమాధానముల ద్వారమున చెప్పవలెను.

నానా నామాశ్రయోత్పన్నం = లక్షణ వాక్యమునందు అర్థ ప్రతిపాదకము లయిన సుబంత శబ్దము లుండును. అవి నానా ప్రకారము లయిన నామ శబ్దములు. ఆ నామ శబ్దముల ననుసరించి యాక్షేప ప్రతి సమాధానముల సముత్పాద ముండవలెను. నామ పదములం దాక్షేప ప్రతిసమాధానములు నిఘంటు నియమాన్వితములై యుండును. నిఘంటు వభిధాన కోశము. అభిధాన ( శబ్ద ) కోశములందు కొన్ని రూఢిశబ్దములు కొన్ని యితరములు నుండును. ఆక్షేప ప్రతి సమాధానముల యుత్పాదము కొన్నిట రూఢిశబ్దములం దన్విత మగును. కొన్నిట ప్రకృతి ప్రత్యయ విభాగ నిగమనముతో నన్వితమగును. ఇదియె నిఘంటు నిగమాన్విత పదమున నిరూపిత మగును. ధాత్వర్థ హేతు సంయుక్తం = లక్షణ వాక్యము నందుండు తిజంత పదముల విషయమై కల రీతి నిది చెప్పును. ధాత్వర్థము క్రియ హేతువు క్రియా నిమిత్త మగు కారకము. ఇట్టి ధాత్వర్థ హేతువుల సంయోజనము నిశ్చయ స్థాపనము నందలి విచారము. క్రియా

కారకముల స్థాపన విచారము కలది యని తాత్పర్యము. ఈ శ్లోకము నందలి మూడు విశేషణములు లక్షణ వాక్యములలో మొదట యొనర్ప వలసిన శబ్ద పరీక్షను సూచించుచున్నవి. "ఈ శబ్ద మీ యర్థమున నేల ప్రవర్తించినది ?" యనునది యాక్షేపము. "ఇదిగో ! ఈ విధ మున ప్రవర్తించినది." యని చెప్పుట ప్రతి సమాధానము. ఇది యంతయు ప్రదర్శించిన వస్తుప్రాతిపదికము.

నానా సిద్ధాంత సాధితం = ఇది యర్థ పరీక్షా దర్శకము. సర్వ తంత్ర ప్రతి తంత్రాదులు నానాప్రకారము లగు ప్రమాణమూలకము లయిన యర్థముల నిరూపించును. వానిని సిద్ధాంతము లందురు. అట్టి నానాసిద్ధాంతములచే సాధిత మగునది. విషయ స్థాపనమున నాక్షేపోత్తరముల సాధనము కలది యని భావము. ఇది యంతయు పరీక్ష. నానా తంత్రము లెన్నియో సిద్ధాంతముల జెప్పును. నామ, ధాతు, సమయ విశేషముల యాశ్రయమున నర్థ సిద్ధి యగును.

౧. "ఉలూఖలః, ఊర్ధ్వఖమస్య" దీని కూర్ధ్వమున నాకాశమున్నది కావున నిది యులూఖలము. అనుచోట నామ శక్తి నిర్ణయ మిచ్చు నదిగా నున్నది.

౨. "రసః" "రస్యత ఇతి రసః" ఆస్వాదింప బడును గావున రసమని వ్యవహారము. ఇందు ధాతు శక్తి నిరూపకము.

౩. "పిశాచః" పిశిత మశ్నాతి" మాంసము భక్షించు నది." ఇందు నామ ధాతువులు రెండును నిరూపకములు.

సమయ విశేషములు మూడు విధములు. లౌకికము వైదికము ప్రతిశాస్త్ర పార్షదము అని. ఇట్టి సాంకేతికము లయిన విశేషములను వేరువేరుగా గుర్తించునది. సంక్షేపముగా నర్థావధారణము నిరుక్త ప్రయోజనము. ధాత్వర్థవచనమున సంగ్రహముగా నర్థ సూచక మగు అర్థము స్థాపిత మగునేని దాని నిరుక్తమని యందురు.

ఈ నిరూపించిన విధమున సంగ్రహమును విస్తరించి స నిరుక్త ముగా స కారికముగా ప్రతిపాదింతు నని భరతు డనుచున్నాడు. సంగ్రహమె విస్తారితమై విభాగము పొందును. పరీక్షా పర్యంత మది విశదము కాదు. కేవలము వచన మాత్రమున సర్వము సంపన్నము

కాదు. అందుననే పరీక్షార్థమై నిరుక్తము. అలక్షిత పరీక్షయు కుదురదు కావున లక్షణార్థమై కారిక. ఇక నాట్య సంగ్రహము వివేచనము చేయవలయును.

### రస ప్రకాశము – మహారసము

౨౨౨. శృంగార హాస్య కరుణా రౌద్ర వీర భయానకాః
బీభత్సా ద్భుత శాంతాశ్చ నవనాట్యే రసా స్మృతాః

నాట్య సంగ్రహము నందు రసము మొదటిది. ఆ రస విభాగమిందున్నది. శృంగార హాస్య కరుణములు రౌద్ర వీర భయానకములు బీభత్సా ద్భుత శాంతములు నని. నాట్యమున నవరసములు విఖ్యాతము లయినవి. నాట్య మనునది సర్వ విధములగు నాటకములలో విశిష్ట విశేషమున ప్రకాశింప దగిన యర్థము. నటుని యందలి యభినయ ప్రభావముచే సహృదయ సామాజికులకు సాక్షాత్కార కల్పము ఏక ఘనమయిన మానస నిశ్చలత యావిర్భవించును. ఆ యేక మానసాధ్యవసేయ మీ నాట్యము. ఇట్లు ప్రకాశింప దగిన నాట్యార్థ మనంత విభావాత్మక మయినను స్థాయిస్వభావము. భావుక సహృదయుని సంభావనములో జగద్గతములయిన జడము లన్నియు సంవిద్రూపములై స్వాత్మ సంవిల్లగ్నము లగును. ఆ సంవిత్తు కూడ భోక్తృ స్వభావమున పర్యవసానము పొందును. నానా విధమయిన భోక్తృ వర్గ మంతయు మహాభోక్తలో పర్యవసించును. ఆ మహాభోక్తృ భావమునందే రసాశ్రయము కాదగిన స్థాయిరూపమగు చిత్తవృత్తి స్వభావ మనుగతమై యున్నది. కావ్య విశేషమున ద్యోతనీయమగు మహార్థ మంతయు చిత్తవృత్తి స్వభావముగా నిర్భాసించును. ఈ యేకఘన మగు చిత్తవృత్తి స్వరూపము సవిశేషముగ గుర్తింప వలసి యున్నది. దీనిలో స్వకీయము పరకీయ మను భేద మాపాదించు విశేష మేమాత్ర ముండదు. ఏది స్వకీయము? ఏది పరకీయము? కొన్ని ప్రమాణములను బట్టి యిదిగో! యిది స్వకీయ మని నిశ్చయింతుము. మఱి కొన్ని మానము లనుసరించి యిది పరకీయమని నిశ్చయింతుము. ఈ నిర్ణయము లిచ్చు మానము లనంతములు. మేయములును మానాధీనము లగుట అనంతములుగనే యుండును. ఇట్టి చిత్తవృత్త్యంతర శత సహస్రములు ఈ యేకఘన

చిత్తవృత్తిలో నేమియు తమ ప్రభావ మాపాదింప జాలవు. అవి యన్నియు దీని నుండి దిగజారి పోవును. ఇది యొక యలౌకిక మయిన చేతోరసము. ఇదియిట్లగుటలో నొక నిమిత్త మున్నది. నాట్య కావ్యములం దుపాత్తము లయిన గేయ పదములు లాస్యాంగములు సంపాదించు నట్టి సౌందర్యమున కావ్యములందలి గుణాలంకారములు శోభా సంస్కార పరిష్కారములు కలవై విలక్షణ సంపదచే లక్షణ రమ్యత సంపాదించు కొనును. గుణాలంకారముల కుపజీవన మిచ్చు టలో నివి యిట్లు నిదానములు కాగా, గీత మాతోద్యము మొదలగు నవి కావ్యమును సమ్యక్సుందరముగా నొనర్చును. అట్లు సుందరీ భూత మయిన కావ్యమహిమ సహృదయ చిత్త విస్ఫారమునకు సహకరించును. అప్పుడు సహృదయుడు నాట్య ప్రయోగానుకార ములో మగ్నోన్మగ్న చేతస్కుడై విశిష్ట సంవిదాశ్రయు డగును. ఇంతటి స్పంద సుందరతచే నాతని చిత్తవృత్తి యేకఘన మగు చున్నది. కావుననే సాధారణ్య మొకటి సిద్ధ మగును. అప్పుడు సామాజికుడు స్వాత్మ సద్భావమున సంవి త్సమావేశము పొందును. ఇంతటి స్వాత్మ సంవి త్సమావేశము నాతడు పొందుట కీ యేకఘన చిత్తవృత్తియే నిదాన మగుచున్నది. ఈ చిత్తవృత్తి సర్వవిధ చిత్త వృత్తుల కన్న విలక్షణము. ప్రమాణ ప్రమేయముల ననుసరించి వస్తు విజ్ఞానము సంపాదించు చిత్తవృత్తి యొక టున్నది. అది లౌకిక చిత్త వృత్తి. ఈ చిత్తవృత్తి లౌకిక చిత్తవృత్తి కన్న విలక్షణము. ప్రమాణ ప్రమేయముల పదవి దూరముంచి తటస్థముగా నుండి పదా ర్థముల నవగతము చేసికొను నట్టి పరిమిత యోగిచిత్తవృత్తి యొకటి కలదు. ఈ యేక ఘనము దీని కన్నను విలక్షణము. సర్వ విధ చిత్త వృత్తి విలక్షణమగు నీ చిత్తవృత్తి తాదాత్మ్యము వలన సిద్ధమగును. పరిమితమగు స్వాత్మాశ్రయత్వ మనునది దీనిలో నిర్భాసింపదు. ఇతర చిత్తవృత్తులేవియు దీని వెంట జనింపవు. నిరంతర ఘనమయిన యిట్టి చిత్తవృత్తి రూఢము కాగానే నిర్విఘ్నమగు స్వ సంవేదన విశ్రాంతి కలుగును. ఇట్టి స్వ సంవిద్విశ్రాంతియె రసనము రసము అని యందుము. రసమిది రసనమను వ్యాపారమునను సంగృహీత మగును. రస వ్యాపార గృహ్యమాణ మగుట రస శబ్దమున వ్యవహరింప

వచ్చును. రస వికల్పమింకను విస్తరింప నున్నాము. కావున రసమే నాట్యము. తత్ఫలము వ్యుత్పత్తి. రస మొక్కటి. అందు విభాగము లేదు. కాని భాగాభినివేశమున రసాంతరములు రూపితము లగు చున్నవి. అని కావ్యార్థమును భావింప జేయును. అట్లు రసములు తొమ్మిది. శాంత మవలంబించు వారు రసము లెనిమిది యందురు. మహా రస మొక్కటి ముఖ్యము. దీని నుండి యితరములు రూపితములగుట యిట్లు సంగతముకానవచ్చును. మహాస్ఫోటమొక్కటియె. పదవర్ణ స్ఫోటాదులన్నియు కల్పితములు. అసత్యములును. మహారసమొక్కటి. రసాంతరములు కల్పితములు. మహారసమునందు రసాంతరములు భాగాభినివేశమున సంభావితములగుచో భాగస్వరూపములనియు గుర్తింపవచ్చును.

## రస క్రమము

రసములను శృంగార హాస్యాది క్రమమున నిరూపించుటలో నొక విశిష్టమగు రమ్య భావ మున్నది. కామము సకల జాతి సులభము. అత్యంత పరిచితము. నిఖల జనులకు హృద్యము. కాన మొదట శృంగారము నిర్దిష్ట మయినది. హాస్యము తదనుగామి. అందుచే రెండవది యయినది. నిరపేక్ష భావమగుట కరుణము శృంగార విపరీతము కావున మూడవదిగా నిర్దిష్టము. పిమ్మట కరుణ నిమిత్త మయిన రౌద్ర ముచితము. అది యర్థ ప్రధానము. కామార్థములు ధర్మమూలము లగుట ధర్మ ప్రధాన మయిన వీర మనంతరము నిరూపిత మయినది. ఆ వీరముకూడ భీతాభయ ప్రదాన సార మయినందున దాని పిమ్మట భయానక ముపాత్త మయినది. భయానక విభావములు బీభత్స విభావములు దాదాపు సమానములుగా నుండును. ఇట్టి సాధారణ్య సంభావనముననె భయానకానంతరము బీభత్స మున్నది. వీరముచే నింతయయిన దని వీర ఫల మిది యని నిరూపించుటకే వీర పర్యంతమున నద్భుతమును జెప్పుట సంగతమగును. "నిత్యము పర్యంతమున నద్భుతము నిరూపింప వలె" నని నియమ మున్నది. కదా! వీని యనంతరము శాంతము సముచితము. ధర్మార్థ కామములు త్రివర్గము. త్రివర్గాత్మకము ప్రవృత్తి ధర్మము. తద్విపరీతము నివృత్తి ధర్మము. శాంతము నివృత్తి ధర్మాత్మకము.

మోక్షఫలకము. ఈ శాంతమునందే స్వాత్మ సమావేశమున రస చర్వణ యున్నది. ఇట్లే నాట్య రసములు నవ సంఖ్య కలవై సుప్ర సిద్ధములుగా నున్నవి.

### స్థా యి క థ న ము

౨౨౩. రతి ర్హాసశ్చ శోకశ్చ క్రోధో త్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయ శమాః స్థాయిభావాః ప్రకీర్తితాః.

రసము విభావాది బలముననె కలుగును గావున రసానంతరము భావకథన ముచిత మగుచున్నది. లౌకికములగు రత్యాది చిత్తవృత్తులను తెలియక పోయినచో కవిగాని నటుడుగాని తద్విషయములగు విశిష్ట విభావాదుల నాహరింప లేడు. రత్యాదులను గుర్తించు నేని కవి నటులు శక్తి కలవా రగుదురు. రతి, హాసము, శోకము, క్రోధోత్సాహములు, భయము, జుగుప్స, విస్మయము, శమము నని స్థాయి భావములు ప్రకీర్తితము లయినవి. శాంతమున కుత్సాహము స్థాయి యని కొందరనిరి. జుగుప్స స్థాయి యని కొందరనిరి. అన్నియు శాంత స్థాయులని కొందరు. తత్త్వజ్ఞాన జన్యమయిన నిర్వేదము శాంతస్థాయి. కావుననె వ్యభిచారిభావ గణనమున నమంగల రూప మయినను స్థాయి వ్యభిచారు లనె డుభయధర్మోప జీవిత్వ ఖ్యాపనము నకై నిర్వేదము మొదటగా నిర్దిష్ట మయినది. స్థాయి భావముల నిర్దేశించు నీ కారికలో సంఖ్య నిరూపితము కాలేదు. కావుననె యీ స్థాయిభావములు వ్యభిచారులు నగును. ఈ యంశమింకను విశదము కాగలదు. నిర్వేదాదులు పూర్వ నిరుక్తములు ముప్పది మూడు వ్యభిచారిభావములు. వాని కారికలివి.

### వ్య భి చా రి భా వ ము

౨౨౪. నిర్వేద గ్లాని శంకాఖ్యా స్తథాసూయా మద శ్రమాః
ఆలస్యం చైవ దైన్యంచ చింతా మోహః స్మృతిః ధృతిః

౨౨౫. వ్రీడా చపలతా హర్ష ఆవేగో జడతా తథా
గర్వో విషాద ఔత్సుక్యం నిద్రా పస్మార ఏవ చ

౨౨౬. సుప్తం విబోధో ఉమర్షశ్చా ప్యవహిత్థ ముథోగ్రతా
మతి ర్వ్యాధి స్తథో న్మాద స్తథా మరణ మేవచ

౨౨౭. త్రాసశ్చైవ వితర్కశ్చ విజ్ఞేయా వ్యభిచారిణః

ఈ వ్యభిచారి భావ పరిగణనమున సంఖ్యా నిర్దేశ మున్నది. వ్యభిచారులివి మాత్రమె యని యుభయతో నియమునకై సంఖ్యో పాదాన మున్నది.

### సా త్త్వి క ము

౨౨౮. స్తంభః స్వేదో ఉథ రోమాంచః స్వరభంగోథ వేపథుః
వైవర్ణ్య మశ్రు ప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికాః స్మృతాః

స్తంభాదు లెనిమిది సాత్త్వికభావములు వ్యభిచారివృత్తము నభినయ వృత్తము నుపజీవింప జేయునవి యగుట వేరుగా పరిగణితము లయినవి.

### అ భి న య ము లు

౨౨౯. ఆంగికో వాచికశ్చైవ హ్యాహార్యః సాత్త్విక స్తథా
భినయాహ్యేతే విజ్ఞేయా నాట్య సంశ్రయా

నాట్య సంశ్రయములయిన యభినయములు నాలుగు. ధనుః ప్రతిశీర్షక మకుటాదుల వలన నాహార్యము ప్రత్యక్ష బుద్ధిలో నంతరంగముగా నుపయోగించును. ఈ నాలుగు లోకమున నొకప్పు డుండవచ్చును. ఉండక పోవచ్చును. నాట్యమున నుండి తీరును. నాట్యమున నభినయమె జీవితము. కావుననె రసభావానంతర మభినయము లుద్దిష్టము లయినవి. అభినయములు లౌకిక ధర్మము ననువర్తించును. లోకధర్మము మూలముగా తదుపయోగి సామయిక ధర్మము ననువర్తించును. కావున వీని యనంతరము ధర్మి నిర్దేశము సముచితము.

### లో క ధ ర్మి : నా ట్య ధ ర్మి

౨౩౦. "లోకధర్మీ నాట్యధర్మీ ధర్మీతి ద్వివిధః స్మృతః"
భారతీ సాత్త్వతీ చైవ కైశిక్యా రభటీ తథా
చతస్రో వృత్తయో హ్యేతా యాసు నాట్యం ప్రతిష్ఠితం

ధర్మి రెండు విధములు. లోకధర్మి నాట్యధర్మి యని. అభినయ మనునది యభినేతవ్యము విడిచి వేరుగా నుండదు. దశరూపక సంబంధ ద్వారమున వృత్తులు తదుపకార మొనర్చునవిగా లోకమున ప్రసిద్ధములు. వృత్తులు రెండని మూడని యయిదని భావింప రాదను

-టకే "చతస్రో వృత్తయః" నాలుగు వృత్తులని స్పష్టముగ ననుట. ఈ వృత్తులందె నాట్యము ప్రతిష్ఠితమై యున్నది. ఈ భారత్యాది వృత్తులును దేశ వశమున నానా విధము లగును. అందుననె యనంత రము ప్రవృత్తులను జెప్ప వలసియున్నది.

## ప్రవృత్తులు

౨౩౧. ఆవంతీ దాక్షిణాత్యాచ తథాచై వాంధ్ర మాగధీ
పాంచాల మధ్య మా చేతి విజ్ఞేయా స్తు ప్రవృత్తయః

ఆవంతి, దాక్షిణాత్య, ఆంధ్రి, మాగధి, పాంచాలి, మధ్యమ యిట్లు ప్రవృత్తులు తెలియ దగి యున్నవి. ఈ ప్రవృత్తులు నాట్య ప్రవృత్తులు. ఇవి యెన్నియేని కావచ్చును. ఓఢ్ర ప్రవృత్తి, వంగ ప్రవృత్తి, కర్ణాట ప్రవృత్తి యిట్లు దేశభేదమున ప్రవృత్తు లుండ వచ్చును. ఈ సర్వము సిద్ధి పర్యవసాయి కావున సిద్ధి చెప్ప వల యును. సిద్ధి దైవికీ సిద్ధి, మానుషీ సిద్ధి యని రెండు విధములు. శారీరములు వైణములు నయిన స్వరములు షడ్జాదు లేడు కలవు. స్వరములు పాఠ్య గాన సంగృహీతము లగును. అయినను పృథ గుపాత్తములు కావలసి యున్నవి. కేవల స్వరములును ప్రయోగోప రంజకములుగా నుండుట లక్ష్యమున గోచరించు చున్నది. అంత రాలాపమున నిది యంతయు ప్రసిద్ధము. ఇది లక్షణాన్వితము కావల యుట సమ్మతము. కేవలము లౌకికము బాధితము. సంగ్రాహ్యము కాదు. లక్షణాన్వితమె నాట్య పరిగ్రాహ్యము.

## ఆతోద్యము

౨౩౨. తతంచై వావనద్ధం చ ఘనం సుషిర మేవచ
చతుర్విధంచ విజ్ఞేయ మాతోద్యం లక్షణాన్వితం

లక్షణాన్వితమగు నాతోద్యము నాల్గు విధములు. తతమ వనద్ధము ఘనము సుషిరము నని. ఈ చతుర్విధమె సర్వము కాదు. బహుల చర్మకారాది వాద్యము కూడ సంగృహీతము కావలెను. "ఆతుద్యతే= అభిహన్యతే ఇత్యాతోద్యం" చక్కగా ప్రయోగింపబడు ట నాతోద్య మను వ్యవహారము సంగతము. తత మను వాద్యము తంత్రీ గతము. అవనద్ధ వాద్యమునకు పౌష్కర మనిపేరు. పుష్కర

మావ_ర్తక మను దేవతాధిష్ఠిత మగుట పౌష్కర మయినది. పుష్కరము= మేఘము, పుష్కర శబ్ద శ్రవణము ననుసరించి యిది సమాగత మయినది. ఇది పద్మ పత్రాకారమున చర్మపుట భాసముగా నుండును. "హన్యతే కలాసామ్యార్థ మితి ఘనః" కలా సామ్యము నకై ప్రయోగింప బడుట "ఘనము" అగును. ఘనము తాల రూపము. కాంస్య తాలాదికము ఘనము. ఇది తాలమె ముఖ్య ప్రమాణముగా నుండును. తాలము స్వరవర్ణ సంభవము.

## ప ం చ వి ధ గా న ము

౨౩౩. ప్రవేశాక్షేప నిష్క్రామ ప్రాసాదిక మథాంతరం
గానం పంచవిధం జ్ఞేయం ధ్రువా యోగ సమన్వితం.

గాన మయిదు విధములు. ఇది ధ్రువా సంబంధమున నుండును. రంగమున పాత్ర ప్రవేశ సమయమున భావ ప్రకృత్యవస్థాది సూచకముగా గాన మొనరింతురు. అది ప్రావేశికీ ధ్రువాగానము. రసాంతరములను తెలియ జెప్పుటకై యాక్షేప గానముండును. అది యాక్షిప్తికి ధ్రువ. పాత్ర నిష్క్రమణ సమయమున నొనర్చునది నిష్క్రామ గానము. వేరొకటి ప్రాసాదికము. రంగము ప్రవేశించిన పాత్రయొక్క యంతర్గత మయిన చిత్తవృత్తిని సామాజికుల కందించుటకై విశదము చేయుటకై ప్రసాద గానము నియతము. ప్రవేశాదులు కేవలము గానోపచారములు. ప్రసాదమె గాన ప్రయోజన మగుట నిది ప్రాసాదిక మగును. వీని యందంతటను ధ్రువా గీత్యాధారముగా నియతమయిన పద సమూహము తగిన సంబంధమున నచట సమన్వితమై యుండును. తదర్థ ప్రాధాన్యమున నియత రూపముగా నుండును. రంగమండపము మూడు విధములని మొదటనె నిరూపితము. కక్ష్యావిభాగము ననుసరించి గతివిధానములకు సర్వాభినయములకు సర్వాను భావములకు గానముల కాతోద్యములకు పకరించునది మండపమె. రంగముననె కక్ష్యావిభాగము సంగృహీతమగును. ఇప్పటికిది యంతయు నల్పసూత్రార్థ మయిన నాట్య సంగ్రహము.

## ర స స మీ క్ష

ఇంతవఱకు సంగ్రహ కథన మయినది. ఇక లక్షణ పరీక్షల

